# రామలింగేశ్వరా.

---

కవి:

తటవర్తి సూర్యనారాయణమూర్తి

జీనకపల్లి



మొదటికూర్పు 1000 ప్రతులు.

తణుకు

శారదాముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

1938.

 [వెల ౨ అణాలు.

# రామలింగేశ్వరా





కాళీహృదయాబ్జసంతతనివా
సీభృంగ, బర్హిర్ముఖా
నీకాపత్తమహోపహంగ, నుతవా
ణీధాతృశేషాహిసం
గా, కైలాసనివాసనద్వృషతురం
గా, దుష్టరక్షోవిభం
గా, కారుణ్యయుతాంతరంగ, ధవళాం
గా రామలింగేశ్వరా.

౨

భవ శంకర హర చంద్రశేఖర విరూపాక్షా క్రతుధ్వంసకా
శివ సర్వజ్ఞ వృషధ్వజా పశుపతీ శ్రీకంఠ గంగాధరా
భవబాధాహారిణా నమోస్తు భవతే పాహి ప్రభో పాహిమాం
దివిషద్భద్రవిధాయకా గిరిశ వందే రామలింగేశ్వరా.

3

పాలీకోద్భవసర్వనిర్జరజగన్నాధాయ తుభ్యంనమః
పార్థివాదిసుతామనోసంసిజబ్ధాయ తుభ్యంనమః
కైలాసాదినివాసభక్తకరుణాకారాయ తుభ్యంనమః
కాలకంఠ! నమామి త్వచ్చరణయుగ్మం రామలింగేశ్వరా.

౪

ఘోరాఘాటవిదావపావకుడవై కారుణ్యపరిత్రాతారి దు
ర్వారతమోధరవజ్రివై, మునిమనోరాజీవభృంగంబవై
స్మేరాంకూరరచజ్జగద్విభుడవై చిన్మూరివై, యొప్పు నీ
వే రక్షించెదవంచు నమ్మితిఁ గృపాబ్ధీ రామ॥

౫

నిరతంబాత్మ తమోనివృత్తికొఱకై నిర్వాణముంగోరె మె
వ్వరి కారుణ్యవిలోకనంబులకునై వాఛింతురో భక్తి నె
వ్వరిపాదాంబుజతోయమందు మునుగం బ్రార్థింతురో ప్రా
పరమాత్ముండవు నీవ భక్తిపరమాత్మా రామ॥ [జ్ఞులా

౬

నీకున్నిదగు భక్తవర్యులకు గానీ యొగ్గులంజేయు వాఁ
డేకాలమ్మున నెందుడాగినను నేరోవారిఁ బ్రార్థించినం
గాకన్ మానదు వానికిన్ మరణమొక్కంబైన రక్షింపఁగా
రాకుంఘున్ గని నీదుక్రోధము మహాగ్రా రామ॥

గేశ్వరా.

౭

నిను సద్భక్తి దలంచువానిని భవానీమానసాబ్జార్క చ
ల్లని కారుణ్యకటాక్షవీక్షణములన్ లక్షించి సంసారబం
ధనముల్ వాయఁగఁజేసి సౌఖ్యగతులన్ గల్పించి విశ్వేశ! ధ
న్యునిఁగాఁజేయుచునుంట - చేయుమటు నన్నున్ రామ॥

౮

అమలంబైన భవత్స్వరూపమును బ్రహ్మాదుల్ గనంజాల ర
న్న మహాత్మా! తెలియఁబోయునైన వశమౌనా నాకు నీదివ్య రూ
పముఁ గొండంత మహత్త్వదేవునకులభ్యంబౌనె కొండంత ప
త్రి మహేశా! భజియింతు వాక్సుమములన్ శ్రీరామ॥

౯

నీమాహాత్మ్యము నీస్వరూపమును వర్ణింపంగ యత్నించుచో
నామ్నాయంబుని దివ్యజూపునటులౌ నవ్వేధయున్ శేషుఁడున్
స్వామీ! నిన్ను నుతింపఁ జాలరనుచో శక్యంబెనాబోంట్లకున్
నామీఁదన్ గృపజూపవే నీతి ఘనంబౌ రామ॥

౧౦

జనుఁడే నీమహిమంబు నేనెఱుఁగ నాశాపాశబద్ధుండనై
పడియున్నాఁడను బాపరూపమున లోపంబున్న సైరించి నీ
యనుగుంద్యములు గొల్చుచుండుటకు నిత్యంబైన సద్భక్తి వి
ద్యాడను ఁడన్నిలుపంగఁ గోరితిని దేవా రామ॥

౧౧

శరణంటింగడు దిక్కుమాలిన ననున్ సౌజన్యభావంబుతోఁ
బరిరక్షింపఁగరాదె దీనులను గాపాడంగ నెల్లప్పుడున్
బిరుదుం గంకణమున్ ధరించితివిగా వేదాంతవేద్యా మహే
శ్వర! నాపట్లను జూపవేమి దయది దేవా రామ॥

౧౨

రక్తిన్మానక నీపదద్వయము బూజాపత్రిచేఁ గొల్చు, నా
భక్తుల్ శాశ్వతమైన బ్రహ్మపదముం బ్రాపింపఁగా నేర్తు రే
శక్తిన్ మున్ను సమస్తనిర్జరులు సాక్షాత్కారముం బొందిరో
భక్తత్రాణ యొసంగు మావరము దేవా రామ॥

౧౩

భవసంతాపము వాపజేయుటకు దేవా నీపదధ్యానసం
భవసంతోషము చాలు; సశ్వతములా భాగ్యంబులెల్లప్పు ని
న్నిత్యులన్ భక్తిఁదలంచువారలకు రానేరావు బాధల్; నశిం
పవు సౌఖ్యంబులు, భక్తహృజ్జలజభాస్వన్ రామ॥

౧౪

కలలోఁగాంచిన యర్థముల్ నిజములే కాంతాదిభోగంబులున్
నిలువన్నేర్చునె, భోగభాగ్యతతులున్నే జీవనంబల్లవే
శిలఁగానాచియుఁ లిప్తసౌఖ్యములకై పారిబ్ధదోషంబుచేఁ
దెలియంజాలరు నిన్ను, దివ్యకరుణాబ్ధీ రామ॥

౧౯

ఇటులెవ్వేళల నీదుపూజలకు భూతేశా మనంబుండకుం
డుట ప్రారబ్ధపుదోషహేతువనుచుందోచున్ భవత్పూజసే
యుట జన్మాంతరలబ్ధపుణ్యఫలమే మో దేవతాభక్తసం
కటనాశా కరుణాలవాల-భసితాంగా రామ॥

౨౦

వైరాగ్యంబొకసాటి కల్గినను భావంబందసారంబు సం
సారంబంతయు మిథ్యయేయనుచు, ద్వత్వాన్మర్థ్యమే మో యు
కారస్వార్థములుప్పతిల్లు వెనువెంటంబాపరూపంబునం [హం
గారించంబడుమానసంబు ధవళాంగా రామ॥

౨౧

తొలిజన్మంబున జేసియున్న పనులిందుంగర్మరూపంబుతో
ఫలితంబంతయుఁబొందఁగానలయు దప్పంజేయశక్యంబె సం
కులభార్యాసుతమిత్రబంధుజనవర్గంబై భవాంభోనిధిం
దలమున్కల్ గ జెలంగువానికి మహాత్మా రామ॥

౨౨

ప్రాజ్ఞుల్ వల్కుచునుందురెల్లపుడు 'సర్వంఖల్విదంబ్రహ్మ' నా
సుజ్ఞానంబును దీనిమూలమున రజ్జుల్ తెల్పింపిసంసారబా
ధాజ్ఞానంబును బాఱద్రోలి పరతత్త్వంబంచు బ్రహ్మాత్మ్యముం
బ్రజ్ఞాచాతురి బొందుచుందురట భర్గా రామ॥

౨౩

సతతమున్ మానక జేయు నాజపతపస్స్వాధ్యాయ ధర్మప్రశ
స్థిత కార్యంబులకన్న సత్యగుణమే శ్రేష్ఠంబు-తత్సాత్యసం
గతికంటెన్ భువిఁ గాంచ బరోపకృతిముఖ్యంబౌచు భాసిల్లు వి
స్తృతమై యొప్పు నహింసయందునఁ గపర్ది రామ॥

౨౪

అరిషడ్వర్గములన్ జయించి తతతృష్ణాతీతుఁడై యొప్పి భా
సుర తేజోమయు నిన్నిరంజన పరంజ్యోతిస్స్వరూపంబునున్
స్థిరతన్ జ్ఞానము చేఁ గనుంగొనుచు వర్తిల్లంగ వెన్వెంట ము
క్తిర మాసిద్ధిక దోయి జీవులకు భృంగీ రామ॥

౨౫

ప్రతియాత్మన్ విలసిల్లు జీవుఁడె పర బ్రహ్మంబు రాగాదిసం
గతులన్ వీడి జయించి యింద్రియములన్, వర్తించు ధన్యాత్మకుం
డతిసాలభ్యముగా నెఱుంగును దదీయంబైన జ్ఞానంబు వి
జ్ఞత యే మోక్షము గూర్చు జీవులకు నీశా రామ॥

౨౬

జరయుం జావును లేని దాత్మ సుమి నాశంబౌను కాయంబె సు
స్థిరమై యాత్మ చెలంగు నే విధమునన్ జీర్ణంబులౌ వస్త్రముల్
దొలఁగన్ నూత్నములన్ ధరించెదమొ మృత్యుప్రాప్తి చే నాత్మయా
కరణిన్ వేఱొక మేను జేఁకొను శుభాంగా రామ॥

౨౭

యోగధ్యానములన్ నిరంతరముల భ్యాసించు నిన్నెంచు మం
త్రాగభ్యాసిత వేదమంత్రముల సంప్రార్థించియు ద్వాత్కృపా
భాగుల్ కారట, కామ్యవర్జితమతిన్ భక్తిప్రధానాత్ములై
రాగాదుల్ పడనాడఁగావలయు రుద్రా రామ॥

౨౮

దారాపుత్రులు మిత్రబాంధవులు సంతాపంబు జేకూర్పు నా
ధారుల్, ప్రాణిఋణానుబంధనము చేఁదానట్టులనోన్యాలం
జేఱన్ వచ్చుచునుండు వారిసుఖముల్ నిత్యంబుతానంచు సం
సారాంభోధిమునింగినిద్దలఁప రీశా రామ॥

౨౯

నిరహంకారతఁగార్యముల్ సలుపుచున్నిత్యంబు లోకావనో
త్కరపాండిత్యకళాప్రగల్భత నింగాత్యాయనీమానసాం
బురుహానందరసప్రదున్ వడిని నిన్ బూజించుధన్యుండు సం
స్మరణీయార్యచరిత్రుఁడౌనుగద - యీశా రామ॥

30

సరసీజోదరుఁడున్ రమాపతియుఁగా చంబాలకున్నట్టి త్వ
త్పరమాశ్చర్యమహాస్వరూపము నెటుల్ భావింపఁగానేర్తు నీ
చరణాంభోరుహ లేశమెల్లపుడు దాల్చఁగోరితిన్ భక్తి నా
శిరమందున్, దయతో నొసంగుమదియే శ్రీరామ॥

గేశ్వరా.

* * * *

౩౧

అమలంబై యఘనాశకంబయి మహాత్మ్యంబై సురధ్యేయమై
సముదీర్ణప్రభావిశేషమయి మించన్ జాహ్నవీగౌతమీ
యమునానామాఖ్యనదీమతల్లు లనవద్యంబైనసౌఖ్యంబుఁ జే
యమహిన్ భారతివర్ష మింపెసఁగుగాదా రామ॥

౩౨

హిమశైలంబదియుత్తరంబునను నద్రిశృంగనానొప్పవిం
ధ్యముతాదక్షిణమందునిల్చి నిజదేశౌన్నత్యముంజెప్ప "తా
జమహల్"శిల్పితనంబుజాటఁ బరదేశంబుల్ సదాయాతుర
త్వముతోమ్రింగఁదలంచుచుండెఁ బరమాత్మా రామ॥

౩౩

ఈదేశంబు భవత్కృపామహిమచే నెల్లప్డుస్వాతంత్ర్యస
మ్మోదంబుంగనుచుండ, నేఁటికిదియే మోమాదుపాపంబొకో
కాదేనిన్ భరతోర్వి;తత్సుతులవిఖ్యాతప్రభావంబుచే
నేదోరీతిగసౌఖ్యముంగనదె-స్వామీ రామ॥

౩౪

దాతృత్వంబు, పరోపకారము, వచస్స్థైర్యంబుధర్మం బహిం
సాతత్వంబు, బహుప్రకారనిగమజ్ఞానంబు, మానంబు; సం
గీతం బాతతసాహితీపటిమ యున్నేర్పించెనూ కట్టిమా
మాతృక్షోణి భవత్పదాశ్రితముసుమ్మా రామ॥

౩౫

పరభూమీశులు'రత్నగర్భ'యనిసంపాదింపఁగాఁజూచుచుం
డిరియీదేశము నెట్టులెట్టులొ,కరెన్సీమాత్రమేయిచ్చి బం
గరుముద్రల్ గొనిపోవుచుండి రిటులంగావించుచుండంగ శం
కర:నీపుత్రులబ్రోవరాదొకొ;పరాకా రామ॥

౩౬

సకలోర్వీతలమందుభారతము శ్రేష్ఠంబౌచుభాసిల్లు స
ర్వకళాపోషణమున్ స్వధర్మరతియున్ వర్ధిల్లు.సత్యంబహిం
సకమైయొప్పుచునుండు ధాన్యధనముల్ సంపూర్ణమైయుండు నేఁ
టికిసర్వమ్మునశింపఁ జూచెదవ తండ్రీ రామ॥

౩౭

వరదా! భారతదేశమిట్టులఁ గృశింపంజూచుటల్ ధర్మమా
మఱినీకోటికయిట్టులున్నదియ సంభావింప నీపుత్రకుల్
నెఱసేమైననుజేసియున్నయెడ దానిన్ నీవులెక్కింతువా
కరుణాంభోధివికావ,కావవ;పరాకా-రామ॥

౩౮

నీసంతానము నిట్లునీకుతగునా నిత్యంబుపేక్షామతిం
గాసింజేయుట;తప్పులున్నవనియేకానిమ్ము, దేవాదిదే
వా,సౌజన్యతఁజూపికొంతబెదరింపంగావలెంగాని యే
దోసాకుంగొనిశిక్షసేయుదువ-బంధూ రామ॥

౩౯

సకలక్ష్మోణివసించియుండెడిసమస్తప్రాణులంగూడఁ దా
వకసౌందర్యకళామహత్వమున్నదివ్యత్వంబుజొప్పించి స
ర్వకళాపూర్ణులఁజేసికూడఁ దుదకీభంగిన్ సమస్తంబునేఁ
టికినాశంబొనటింతువా తగునె తండ్రీ రామ॥

౪౦

పరదేశస్థులునేఁడుమాభరతసౌభాగ్యంపురేయెండలోఁ
దిఱుగంజొచ్చిరి; మాముస్వచ్ఛతరకీర్తిస్ఫారనక్షత్రవి
స్ఫురదాకాశమువారికిన్ ముకురమైశోభిల్లు లోకేశ-మా
సిరులన్ మాకులభింపంజేయుముకృపన్ శ్రీరామ॥

౪౧

తలఁపన్ భారతదేశమిట్టులనితాంతంబైనదారిద్ర్యబా
ధలచేనిక్కిలిడస్సినేఁడునిజపుత్రశ్రేణికింగూడుగు
డ్డలుచేకూర్పఁగలేకనూరకయుచూడంజొచ్చుటల్, త్వత్కృపా
కలితార్ద్రీకృతలక్ష్యగ్రహించుటకునొఁగా రామ॥

౪౨

మాలోమాకెపుడుద్భవంబయునదోమాత్సర్య మవ్వేళనే
తాళంజాలకమాసిసిల్ పఱుగులెత్తంబూన నెచ్చోటికో
మాలోనుండినచేవయుందఱిగె మామానంబుపోకుండఁగా
నాలోచింపుము దేవదేవుఁడవు దివ్యా రామ॥

౭౩

జనియించెన్ భరతావనిన్ సకలరాజ్యక్షేమముంగోరి మా
వనిసత్యంబు-నహింసతోఁగర్మము దంచ్ గాంధీమహాత్ముండు చ
క్కనిరాజ్యాంగవిచక్షణత్వమున లోకంబెల్లనో హోయనన్
ఘనుఁడీవేయిటులుద్భవించితివ-భర్గా! రామ॥

౭౪

భరతక్షోణినహింస-సత్యముల కెబ్బంగిన్ విఘాతంబు సే
కుజకుండంగనుచుండు 'గాంధి'క విముఖ్యుండౌర వీంద్రుండు'
సురలోకోత్తరదివ్యభావకవితాశుంభత్త్రివేణీపవి [భా
త్పొరసోద్వృద్ధి స్వదేశగౌరవమహత్త్వంబున్ సదాపాడు శం
కర,యిట్లున్నను మాకిదేమిగతి_భర్గా రామ॥

౭౫

భరతక్ష్మాస్థలి రాజకీయనిపుణుల్ 'పట్టాభి' 'దేశాయి' సు
స్థిరనాగ్ధిరులు సత్యమూర్తి' ముఖరుల్ 'శ్రీనివాసు' 'రాజాజి;' 'జ
హ్వారలాల్ 'ముఖ్యులువీరు పుంగవులు దేశారాధనాతత్పరుల్
వరిలన్;నీకృపచేసుఖంబులికరావా రామ॥

౭౬

సకలోర్వీతలవాసజీవతతికెన్ సౌఖ్యంబుఁజేకూర్చఁగా
టకమౌంబాపసమర్థులౌరయితుబిడ్డల్ నేఁడు సుం తేనిగూ
టికిలేకుండఁగ నేడ్చుచుండి రిదితండ్రీ!చూడవా వారికో
శికలంబూర్ణముసేయనెంచవ కపర్ది రామ॥

౪౭

నానాటన్ దిగఁబోవు క్షుత్పిపాసలు సమానంబై నమామూళ్లచే
నానాకీటుల బాధలం బొరలఁ బ్రాణంబుల్, దినందిండియున్
మానంబున్ నిలబెట్టుగుడ్డను ధరింపంజాలకున్నారు స్వా
మీ నీపుత్రుల-రైతుబిడ్డలఁ గతేమీ-రామ॥

౪౮

సతతంబాగమశాస్త్రచర్చయు ననాచారక్రియాధ్వంసనం
బతిసత్యవ్రతదీక్ష యెట్లనఁగ సేద్యంబట్టులే యొప్పభా
రతిదేశంబున దీనివృద్ధికొఱకై 'రంగా'దులున్నారు త
ద్ధితముం జేయుమి హేకృపార్ణవ-కపర్ది రామ॥

౪౯

భూతేశుఁడవు నీవు నీవలె జగంబున్ భూతజాలంబులం
జేతోమోదమునొందఁ జేయుటకు సంసిద్ధుల్ స్వదేశస్థులౌ
రైతుల్ మీరుపరస్పరాప్తులగుటన్ రావేమి తత్కష్టసం
ఘాతంబుల్ తొలఁగించి సౌఖ్యములొసంగన్ రామ॥

౫౦

ధర నీసంతతి సౌఖ్యమొందుటకుగాదా అన్యదేశాలలో
దొంతరంజాలని 'కోహినూరు' మణినెంతో ప్రేమనందిచ్చె దే
శరమావృద్ధికిని 'రత్నఖని'గా సంసిద్ధిగావించి యీ
కరణిన్ సర్వమురిత్త సేయుదువ- భర్గా- రామ॥

౫౧

గనులా నిత్యముగోట్లకాంచనమొసంగంగల్గుఁ; బాన్ధోధులా
మణిముత్యంబులురత్నరాజఁబ్రిసవిఁపగల్గ మాధారిణీ
వనులా చైత్రరథంబునందనములన్ భంగించు మాభారతో
ర్వినిలేకుండిన దొక్కటైనఁగలదా శ్రీరామ॥

౫౨

జనులా శౌర్యగభీరసత్వసధనంచారుల్ స్వకీయంబులా
పనులా స్వోపరోపకారగుణాస భావమ్ము లేనట్టిదిం
గినులా దివ్యసుధారసప్రసవముల్, కించిత్కృపాలేశమం
చినచోమాపయినీవు, లోటుగలదా శ్రీరామ॥

౫౩

స్వామీ! యేమిదినేఁడుమాభరతదేశఖ్యాతినిస్సారమై
నామంబైననులేకపోయెనిటు లానాఁడున్నమాశక్తులా
హా! మూర్ఛిల్లెనొ మాదునాటకసభ్యత్వంబనమ్మయ్యెనో
ఏమో దీనినెఱుంగఁ జెప్పుమి-కృపాబ్ధీ రామ॥

౫౪

మాదేశీయపరిశ్రమల్ తొలఁగి సంపద్రాశియారీతినా
నాదేశంబులకుంబ్రయాణమగుచుండం దిండియున్ సుస్థయున్
లేదేయుంచిపుడేచ్చమానుమొఱలాలింపంగరావేమి మా
యీదైన్యమ్మునుబాపనెంచవిదియేమీ! రామ॥

కేర్వరా.



౫౫

ఈనాఁడున్న ప్రభుత్వ వైఖరిని మా యీ విన్నపంబుల్ వినం
గా నీకున్ వలెనో 'సిఫారసు' స్వసంతాన క్రియాదక్షతా
నూనత్వమ్ము నెఱుఁగవో - విబుధ బంధుల్ గారొ మావార ల
లైనంగూడను ధర్మమా నెయిటు చేయన్ రామ॥

౫౬

అతికారుణ్యరసోల్బణుండవుగదా యీనాఁటికానాఁడు భా
రత దేశాభ్రమునన్ విపజ్జలదముల్ క్రమ్మంగ నీవింతయుం
బ్రతిగావింపఁదలంపవేమి అదిగో బర్హిర్ముఖశ్రేణి చిం
తితమై కన్పడుచుండె నేలకో - కపర్ది రామ॥

౫౭

క్రతువుల్ చేసియనారతంబును హవిర్భాగంబులందిచ్చి దే
వతలం దత్పతులన్ సమృద్ధిగ భుజింపంజేయు మా దేశపున్
స్థితి శోకంబు ఘటింప నీకరుణకై చింతించుచున్నారు దీ
నత వాపంగలదిక్కు వీవను చనంతా రామ॥

౫౮

దొరవై నేఁడు మహమ్మదీయులను హిందూజాతిలోనం బర
స్పర వైషమ్యములెల్ల సాంఘిక పరిష్కారమ్మునం దీర్చి యొం
డొరులున్ సోదరబుద్ధితో మెలఁగునట్టుల్ సేయు భారంబు తీ
ర్పరివౌ నీభుజపీఠిపై గలదు భర్గా రామ॥

౫౯

అమృతంబుంజలికించువాగ్ఝరి సుబోధానందసంజాత బా
ష్పమిళింటాక్షియుగమ్ముజూడనమరుంబ్రాక్ప్రశ్చిమాకాశ భా
గ్యమరీచీనిధి మాపురాకృతసుపుణ్యాంభోధిరత్నంబుత
త్వమహాదర్శనవేత్త జ్ఞాననిధి 'రాధాకృష్ణచంద్రుండు' స
త్వముసాధింపమె సుంత నీకరుణగల్గన్ రామ॥

౬౦

జననంబొంది సమాన దేశమునసే సంపూజ్యహిందూమతం
బునె స్వీకారమొనర్చి నీచరణాంభోజాతముల్ నమ్మికొం
చును జీవించుచుఁదోటిసోదరులకెన్నో సౌఖ్యముల్ గూర్చువా
రిని నస్పృశ్యులటంచు గెంటఁదగునే శ్రీరామ॥

౬౧

ఒకచోమేనికిదాకఁగా ననలవిద్యుచ్ఛక్తు లవ్వేళనే
వికలంబౌనసుఖుల్ తలంపఁగను నస్పృశ్యంబులౌశ్వానముల్
నకులంబుల్ దరిజేర్చ నెంచుదురు సానందమ్ముతో, సాటి వా
రికి అస్పృశ్యతజూపి త్రోయుదురుగా శ్రీరామ॥

౬౨

పురుషుల్ స్త్రీలను రెండుజాతులఁగదా పుట్టించియున్నం బర
స్పర కార్యార్థము జాతులేర్పడియె విశ్వప్రేమభోనాడి మ
త్సరపైశాచికతాండవంబున దరిద్రశ్రేణిసత్వంతముం
దఱుమంజొచ్చిరి అగ్రజాతులమనేదైర్ఘ్యంబు గర్వంబుతో
గరుణాపాత్రుల మాలలంచు భసితాంగా రామ॥

౬౩

జనకుండివసమస్తజీవులకు నీశా సృష్టిలో హెచ్చుత
గ్గును గల్పించి మనుష్యజాతులకిటుల్ కొట్లాడఁగాఁ జేతువా
గానముల్ లేనిసవర్ణులా ఘనులు నీకున్ మాకు నాధారులా
జనులా మాల లవర్ణులాహా జగదీశా రామ॥

౬౪

నిన్నే దైవముగాగ నమ్మినప్రజానీకంబు దారిద్ర్యపుం
బన్నమ్ముల్ వడుటా, విధర్ములై సురాపానంబునన్ మత్తులై
కన్నుల్ విప్పక జారులై తిరుగుమూర్ఖశ్రేణు లత్యంతసం
పన్నత్వమ్మును బొందుటక్కజము దేవా రామ॥

౬౫

ఒకచోటన్ సుఖరాశి యొక్కెడ దుఃఖోద్వృద్ధి లహోధికా
రికి సాధోపరిభాగవాసమును దారిద్ర్యంబుచేఁ బొట్టకూ
టికి లేకుండుట నేడ్వనొక్కఱుఁడు దండ్రీ చేతువా ధర్మమా
ప్రకటీభూతకృపాసముద్రుఁడవుగావా రామ॥

౬౬

భూకంపమ్ము విషూచి మారులనిశంబున్ జీవసంఘమ్ములన్
బోకార్పంగను చిట్లుమానమున శంభూ యూరకున్నాఁడవా
లోకారాధ్యుఁడవై చెలంగుచుఁ గృపాళుత్వంబుతో మాన్పవా
నాశంబియ్యదినానొనర్పవ అనంతా రామ॥

౬౭

మఱలంజూతుమె యెన్నఁడైననుమహాత్మా స్వేచ్ఛస్వాతంత్ర్యముల్
వఱలంగట్లున భాగ్యరాశులిటఁ బ్రవంబొక నెచ్చోటికిం
గరుణాలేశము మాపయిం బఱపవా కళ్యాణముల్ గూర్పవా
వరదా! భారము నీదెయంచు యును దేవా రామ॥

౬౮

బాలుండన్ భవదీయదివ్యకరుణాభావంబు సాధింపఁగాఁ
జాలన్ నాకృతిలో, భవత్కృపను లేశంబైన బొందంగ గా
రీలోలా, బలమున్న మాభరతధాత్రి పూర్వసౌభాగ్యముల్
మాలో జేర్ప వరంబు గోఱితిని దేవా రామ॥

౬౯

మునుపేరీతిని భోగభాగ్యములు సంపూర్ణంబుగా సిండియుం
డెనో యేమైక్యతకల్గియుండెనో మృడానీనాథ! నేఁడట్లునీ
యనుకంపన్ భరతావనీస్థలిని జేయంగోఱితిన్ గాంధిదే
వుని కోర్కుల్ ఫలియింపఁజేయవలె శంభూ రామ॥

౭౦

స్థిరతన్ మాభరతోర్వి నైక్యతయు బ్రాచీనార్యసిద్ధాంతత
త్పరతం గాంచికర్మభూమి యని పెద్దల్ వల్కువాక్యంబు ను
ద్ధరణంజేసి యమర్త్యులాదిగ సమస్తప్రాణులున్ సంతతా
దరదృష్టిం గనునట్లు జేయుము మహాత్మా రామ॥

౨౧

మునునీపైవిఖ్యాతిఖ్యుంచినారు శతశతంబుల్ భక్తులెన్నెన్నొ ము
క్తినిగాంక్షించి; మహాత్మ భారతధరిత్రీ సౌఖ్యసంధానమే
వినయంబించెద స్వార్థముందలఁప దండ్రీ యట్లుగావించిమా
ఘనతన్ మాకొసగూర్పగాఁ జలయు భర్గా రామ॥

౨౨

నినుస్మోంబించెశతకోట్ల వృకగణావే వేల్పువిద్వేషులై
నను సాధింతురు స్వార్థముల్ సకలవిజ్ఞానాబ్ధి మా భారతా
వని తొల్లిటి స్వాతంత్ర్యతాసుఖసుసంపత్తుల్ గనుంగాకయీ
మనవిం జేకొని చేయుముట్టుల మహాత్మా రామ॥

౨3

ఏ దేశంబున జన్మమొందుటకు లోకేశాచ్యుతేంద్రాదిము
ఖ్యాదిత్యాధిపతుల్ సదాతలఁతురో యాధ్వర్యభాగంబు లె
ట్టేదేశంబుననుండి పొందుదురో ఆయీకర్మభూమిన్ సుఖ
ప్రాదుర్భావము చేయఁగోటితిని భర్గా రామ॥

౨౪

యాతాయాత సురాధినాథులకు బ్రహ్మానందముంగూర్చువి
ఖ్యాత శ్రీపదనూపురక్వణితభోగైశ్వర్యరంగస్థలం
బాతిథ్యవ్యవసాయి ఆస్తికమతధ్యాతంబు పూతంబు మా
మాతృక్షోణి భవత్పదాశ్రితముసుమ్మా రామ॥

*  *  *  *

౭౫

సతతంబెట్టుల వారిమధ్య నివసించంగల్గుచున్నాఁడ వ
ద్భుతమైయొప్పును గ్రీష్మమందు సుఖమబ్బుంగానికాకున్నయా
ఋతువుల్ కష్టములౌను గర్భగుడిలో నెల్లప్పుడుఁ నీర మొ
క్కటటాకమ్మునుండి వచ్చుగద భర్గా రామ॥

౭౬

రాకన్ మానినచో జలమ్మిటుల నీగ్రీష్మంబు వైశ్వానరో
త్సేకంబౌనఁట, తొల్లి యా త్రిపురరాట్ శిక్షార్థమై బూనియు
గ్రాకారమ్మున వారిఁజంపి ఆ జేనీవారూపుతో నీటిలో
శ్రీకంఠా వసియించఁబోలిచట శూలీ రామ॥

౭౭

శితికంఠా ప్రజసేయుచుండఁరో దకం జీకాకఁ చే బిట్టుడ
స్సితివో కాక మతేమొ నిత్యమును విస్తీర్ణంపు లోకావళుల్
జతురత్వమ్మున సృష్టిచేయునెడ నాశబ్దంబు నెట్లోర్తు వీ
గతిదూరంబున నుండ హేతువెది భర్గా రామ॥

౭౮

అతిపుణ్యాత్ములైన మాప్రజల సేవాభ్యర్చనాకృత్యముల్
దతకారుణ్యముతోడఁ గైకొనఁగ మాధాత్రీమహత్వంబు వి
స్తృతమైయున్నది; గాకయున్న రజతాద్రిన్ వీడి యిచ్చోట నీ
గతి వాపంబొనరింపనెంచెదవ భర్గా రామ॥

౨౯

తలపై జాహ్నవి నీటిలోనునికి శైత్యంబేమియుం గల్గదో
గళమందున్న హాలాహలోగ్రమహాగ్నిజ్వాలికామాలిక
వలిచే దానిని బాపుకొందువా తలంపన్ నీప్రభావంబు గ
ట్టులరాచూలిమగండ శక్యమగునెట్టుల్ రామ॥

౩౦

మా రాజుమ్ము ప్రపంచమంతయు నీమాహాత్మ్యమే మోసకా
చారుల్, నిర్భయ పాపకర్ములు నహింసాసత్యకార్యోన్ముఖుల్
జారుల్ చోరులు సింహియుండి రెటులన్ సైరించియున్నావు రా
నేరాదా తలఁపింతరైన నిటుఁదండ్రీ రామ॥

౩౧

జాతుల్ కూడ స్వకీయధర్మము లనుష్ఠానమ్ములన్ మానె నీ
చేతల్ నమ్మరు నాస్తికత్వమెదలోఁ జేపట్టి విత్తంబు వి
ఖ్యాతిం గూర్చుచునుండె వేదవిహితవ్యాపారముల్ మానిరా
మీతాత్పర్యము యిట్టులుండినను రమ్మా రామ॥

౩౨

పరిరక్షింపఁగ సాధుపుంగవుల శశ్వద్దుష్టశిక్షార్థమై
ధరణిన్ ధర్మపునఃప్రతిష్ఠకొఱకై తత్తద్గతింబుట్టి యు
ద్ధరణం జేతువు గోమహీసురుల సద్ధర్మమ్ము నీవంటి స
త్కరుణాపూర్ణులు నిల్పఁగావలయుగాదా రామ॥

౨౩

ఏరూపంబున నుందువీవనుచు నిన్నెంచగవచ్చున్ స్తనా
కారంబో యదిమేకపెంట్రికయొ మోగాలో మతింగుంచమో
పశీతింధలపోయఁగావలయు భూతేశా భవద్దర్శనం
బేరీతిన్ లభియింమనాకు గరుణాబ్ధీ! రామ॥

౨౪

భువనంబుల్ జనియింపఁ జేయఁగ స్వయంభూరూపముంగాల్చి
కే
శవరూపంబున లోకముల్ నిలిపి తత్సంహారముంబాగ్వతీ
ధవరూపంబునఁ జేసి భాసిలుమహాత్మా నీత్రిమూర్త్యాత్మసం
భవకారుణ్యము బోధించుఁగాతనను దేవా రామ॥

౨౫

శ్రీపద్మాసహృదయేశసన్నుతజగల్లీలావినోదుండవై
పాపారణ్యదవానలుండవయి సద్భక్తాబ్జభానుండవై
పాపింగొలిచినవారి నెల్లఁగృపన్ రక్షించి సంసార సం
తాపమ్ముల్ నశియింపఁజేయుదువుగాదా రామ॥



౨౬

ఎటులుండాళుచునుంటివో యిచలి నిన్నే వేళ బాధింపదా
పటుశైత్యంబు నున్ని వస్త్రములు గప్పంబోక మేనుండ లే
మటురాతిత్రింబగళున్ దిగంబరుఁడవై ఆశీతశైలంబుపై
నిటులాక్షా వసియించుచుంటి వెటులన్ శ్రీరామ॥

గేశ్వరా.

౮౭

ధనదుండాప్తసఖుఁడు మేరుగిరినీ నిస్థానంబు దేవేంద్రము
ఖ్యనిలింపుల్ పదచారులంచితమనోజ్ఞాభూషితా భూషణ
క్వణనారంజిత పార్వతీలలనత్వద్భాగ్యాలలామంబు మా
వని యీ బిచ్చఁపు వేసమేల భసితాంగా రామ॥

౮౮

కైలాసాద్రినివాసభూమియఁట నాకశ్రేష్ఠమాణిక్య భూ
పాలాలిత్యకిరీటసన్నమితదిక్చక్రాధినాథోత్తమాం
గాలాహిత్యపదాబ్జధూళి వఁటనాకాశ్చర్యమా నిట్టు లే
వేళన్ ముష్టికి దేవురించుట కృపాబ్ధీ రామ॥

౮౯

లీలం బ్రాజదువుల్ నిరంతరము వర్ణింపంగ భాసిల్లు నీ
కేలా యిట్టి విడంబనమ్ములభవా యీశానితోఁగూడినం
జాలంబోవక దారుకావన నివాసస్త్రీల భోగించుటల్
కాశేకంఠ యివన్నియక్కజములౌఁగా రామ॥

౯౦

సకలప్రాణులబ్రోచువాఁడవఁట యాశ్చర్యంబు సంధిల్లెఁ దా
వకకారుణ్యముగోఁటి ఫల్గుణుఁడు సేవల్ చేయుచుండంగ వా
నికి నీవోఁడివరంబులిచ్చితఁట నీస్నేహంబు వాత్సల్యముం
బ్రకటీభూతముసేయుఁగానిది నిజంబా రామ॥

౯౧

ఘనుకందాలిచి బిచ్చమెత్తికొను చెప్పున్దీనతన్ వాడవా
డను సంచారము చేతువేల శితికంఠా! బ్రహ్మహత్యామహా
ఘనివృత్తింగనఁగోతికావలయుఁ బ్రాక్ప్రాత్రంబు దప్పింపఁగాఁ
జనునే యొకటివానికైనను మహేశా రామ॥

౯౨

కరుణామూర్తి విగాకయున్న యెడ దక్షుంబ్రైన హాలాహలో
త్కరవైశ్వానరకీలలెట్టులను మ్రింగంబూనికం జేతు వ
ర్ధర! నీగొప్పతనంబుగాదు, గిరిజాదివ్యప్రభావంబు శం
కర, నీకన్నఁగృపార్ద్రిమాజనని భర్గా రామ॥

౯౩

వలరాజేమియొనర్చె నెగ్గనిజపంబాడియే నీకు వే
ల్పులు పుత్తెంచిరటంచు నీ నెఱుంగవో పున్నెంబుగావింపఁగాఁ
దలఁపంగీడగునన్న నామొత యథార్థంబయ్యె నీవంటి పె
ద్దలకుం బెద్దకునిట్టి కార్యముల రుద్రా రామ॥

౯౪

కలుషాత్ముల్ సతతంబు నిన్నుఁ జచిలోకప్రభవాస్న్యముల్
కలకాలంబుస్థిరంబులంచుఁ దలఁపంగాఁ బిస్సుటంగల్గువా
రలచ్ఛైవస్థితి జెప్పగాఁదరమె, పాఁ రబ్ధంబట్టులంగట్టి మి
క్కిలి నేడ్పించగశక్యమేరికి బినాకీ రామ॥

౯౫

కడుఁబుణ్యంబులొనర్చువారలకె వేగన్వచ్చుఁగాజావు నీ
యడుగుందమ్ములఁగొల్వఁబోక నటుసేయంబూను నీభక్తులన్
వడిదూషించెడిపాపులే బ్రతుకుచున్నాఁడంజూడనాశ్చర్యమ
య్యెడు-భక్తార్తివినాశకుండవిదియేమీ రామ॥

౯౬

పరికిన్ భుజగంబునోటఁబడియున్ హింసింపఁగా నీగలం
బ్రారంభించునొకప్ప, యాకరణిగాలంబన్న సర్పంబుచేఁ
గాటింపంబడుచుండియున్ విషయతాకామ్యంబునంజిక్కి సం
సారానంతమహాంబుధింబడితి నీశా రామ॥

౯౭

కాలంబంతయు నీయధీనమఁట కాఁగాఁ జిత్రవైచిత్ర్యపున్
లీలల్ జూపుచునుండు వెల్లువడుశూలీ దానివప్పింపలే
రాలో కేశదివౌకసాధిపతులున్ వ్యామోహసంయుక్తులై
కాలంపున్ మహిమంబెఱుంగరఁట-భర్గా రామ॥

౯౮

నా సంప్రార్థన నీచెవింజొరదొ నానాలోకసంరక్షణ
వ్యాసంగత్వముచేత నామొఱవినన్ భావింపవో కాకనా
దోసంబో, గిరిరాట్సుతాపరిణయబద్ధుండవౌటనో యేల
లాసావాస! పరాకుచేతువిటు రుద్రా రామ॥

౯౯

కరుణాంభోనిధివై జగద్గురుఁడవై కాత్యాయనీభర్తవై
పరమామ్నాయసమూహసన్నుతుఁడవై భక్తప్రపోషుండవై
చిరసంపాదితపాపనాశకుఁడవై శ్రీశైలవాసుండవై
పరిరక్షింతువులోకజాలములు దేవా రామ॥

౧౦౦

త్రిదశత్కోటిసురల్ సురాధిపతులున్ దేవర్షులున్ భక్తిఁ బ్రాఁ
జదువుల్ తోడనుతింపుచుండఁగ జగచ్ఛ్రకంబుగాలింపనా
స్పదమైయొప్పెడుశీతలేక్షణములన్ సారించునీతాండవం
బది నాకిచ్చుత సర్వసౌఖ్యములు దేవా రామ॥

౧౦౧

కలికాలంబునఁ బాపులెక్కువగ లెక్కల్ మీఱఁగా నందరం
దులకై వారలపాపజాలములు వేత్రు చంగ సీవెంచిప
త్ఫలముంగూర్పుటకై 'కలిన్ స్మరణచేతన్ ముక్తి నాధర్మమీ
యిలలోనిల్పితి వాహ యేమికృప-స్వామీ-రామ॥

౧౦౨

పరమంబైనమహత్వమీవయె పరబ్రహ్మంబునీవే చరా
చరభూతాత్మకుఁడీవ మోహితమతిన్ సంసారరంగస్థలిం
దెఱువింతైన నెఱుంగకందిఱుకువానింగాచువాఁడీవ దు
ష్కరకార్యాచరణుండవీవ భవనాశా రామ॥

౧౦౩

కరిచర్మాంబరధారివై శిరమునన్ గంగావిభూషుండవై
హరిణం బొక్క కరంబుతో డమరుతో ఆస్త్రిశూలంబుతో
గిరిజాక్రోడనివాసివై కరుణతోఁ గ్రీగంటివాల్జూపుతో
గిరిశా! బ్రోవుము భక్తిఁ గొల్చెదఁ బినాకీ రామ॥

౧౦౪

కలలోఁ గన్పడివార్యయఁ గాశశశకుముంగావించినావాజ్ఞ నీ
విలసద్దివ్యకృపాకటాక్షములఁ జేవిశ్వేశ! లోటుండు నే
జలజాతప్రభవాదిదేవతలకున్ శక్యంబుగాకుండు నా
నలలో నైననుగాంచు భాగ్యమొదవె నాగా రామ॥

౧౦౫

సమసెన్ లోకములన్నియున్ నిలిపి విశ్వస్వామి తదత్రికణో
త్తమకార్యంబును జేయఁగాఁ 'దణుకు' నొట్టంగల్గు 'పాలంగి' గ్రా
మమునన్ గోస్తనదీతటంబున జగన్మాంగళ్యసంధాయక
త్వముగాంక్షించి వసించియుంటివి మహాత్మా రామ॥

౧౦౬

కనఁగా హేయములైనవైనను మహాకాంతున్ సదా యేస్తుతో
లును ముప్పన్నె మెకంపుదోలు విడకెట్లుందాల్తు వట్లేకృపం
జని యీసారములేనినాశతకమున్ 'శార్దూలమత్తేభవృ
త్తనిగూఢంబున' గైకొనందగు ననంతా రామ॥

౧౦౭

ధనము లేదు భవత్పదాబ్జభజనధ్యానంబ రాబోదు, వ
చ్చిన దాపత్రయరాక్షసీకబళమై జీర్ణించు సంసారబం
ధనముం ద్రెంపంగ వీలుగాదు, సకలార్థప్రాప్తికై యాశ నా
శనముంగాదు — మరెట్లు బ్రోచెదవో యూశా రామ॥

౧౦౮

ననునార్వేలనియోగివంశజుని నానాగ్రంథనిర్మాణద
క్షుని కౌండిన్యసగోత్రసంభవుని సద్వాచ్ఛుంభత్పదాంభోజచిం
తనునిన్ శ్రీతటవర్తివంశజు ననంతా సూర్యనారాయణా
ఖ్యుని బ్రోవంగ నిదిచ్చితిం గృతిగ నీకున్ రామ॥



ప్రతులు వలయువారు :

తటవర్తి సూర్యనారాయణమూర్తి,

పాలంగి.

తణుకు తాలూకా,

(పశ్చిమగోదావరిజిల్లా)

